# స్వప్నభంగం

(కావ్యం)



సి. నారాయణరెడ్డి



ఆదర్శ సాహిత్యమాల
హైద్రాబాదు

రెండవ కుసుమము
మొదటి ముద్రణ

వె ల :

| | |
|---|---|
| సభ్యులకు | పదునాల్గణాలు |
| ఇతరులకు | రూపాయి |

మా సాహిత్యమాల మొదటి పుష్పమును "ఆంధ్రావతరణము" నా డాంధ్రి పాదపీఠి నలంకరించి కృతార్థులమైనాము. ఇది రెండవ కుసుమము.

ఈ కావ్య ముద్రణ వ్యయమును భరించినవారు మహబూబునగరం జిల్లా, నవాబుపేట గ్రామ నివాసులు శ్రీ యస్. లక్ష్మణరావు, యస్. రంగారావు గార్లు మరియు ఆలూరు గ్రామనివాసులు శ్రీ టి. రాఘవేంద్రరావుగారు. వారికి సాహిత్యమాల పక్షాన కృతజ్ఞతలందజేస్తున్నాను.

సాహితీ ప్రియులైన యం. నరసింహాచార్యులు, మహబూబునగరం తహసీల్దారుగారు ఈ కావ్య ప్రచురణను ఎంతో ప్రోత్సహించినారు. వారికి నమస్కారాలు.

శ్రీ నారాయణరెడ్డిగారిని గాని వారి కావ్యాన్ని గాని పరిచయంచేసే అనవసర ప్రయత్నానికి పూనుకోక, వారికి నమస్కృతులర్పిస్తూ, రసాస్వాదన చేయుమని తెలుగు రసికలోకాన్ని ఆహ్వానిస్తున్నాను.

2-2-1121,
నల్లకుంట,
హైదరాబాదు-13

కార్యదర్శి
ఆదర్శసాహిత్యమాల

# స్వప్నభంగం

నాకు రెక్కలు మొలిచి
నవి; పిలిచినవి పయో
ధర భరమ్మల్లాడ
తరుణ తారలు నన్ను.
తారలో; తారలను
తలదన్ను అప్సర
స్త్రరుణులో నా గుండె
తల నిమిరి నటులాయె.
ఎచటికో రారమ్మ

సుచు పిలిచినటులాయె.
నేను వాగ్రూపాన
గాని, లిఖితస్థితిని
గాని, ఆహూతుడను
కాలేదు, ఐననెవా
కన్గిలుపు లెవియొమై
కదలింతలే నాకు
పిలుపులుగ వలపు జా
బులుగ భాసించినవి.
పిలుపు వినబడినంత
మొలిచెనో రెక్క; లవి
మొలిచినంతనె మూగ
పిలుపు విన్పించెనో ?
ఎటులైననేమి నే
నిదిగో ఉడ్డీన ది
వ్యానుభూతిని పొంది
నాను, మిన్నుల నీది
నాను, నాలో నెపుడు
లేని గంధర్వ నవ
భావ సౌవర్ణ ప
క్షావిష్కరణ మాయె.

నే నెవడ? మానవుడ
నేయంచు నాకునే
నే సమాధానమ్ము
చేసికొని యత్నించ;
కానుచు గంధర్వు
తా నవ్య భావమ్ము
ఒక మబ్బు తున్క పో
లిక మనసుపై ముసిరె.
అపుడు నాలో కన్ను
లరవిచ్చి చూచితిని
అపుడు నా లోకన్ను
లరవిచ్చి చూచితిని.
నేను గడచిన గడియ
లోన మెయినిండ చు
ట్టిన వల్వ లెగిసి పో
యెను మంచుతెరలట్లు.
దిగ్వసనములు దాల్చి
తినొ నేను? కాదు సిత
రుగ్వసనములు మేన
రూపొందె ననిపించె.
తెలతెల్ల మొయిలు తీ

వెల నల్లి నా కొరకు
పానుపెవ్వరో సిద్ధ
పరచి దాగున్నారు.
జలద నిర్మల తల్ప
శాయినయ్యేద దాగి
యున్న వాసకసజ్జ
నన్ను చేరెడు వరకు.
నా చుట్టు పూర్ణచం
ద్రప్రభావీచికలు
విరిసినవి క్షీరసా
గర తరంగము లట్లు.
పాము కుబుసమువంటి
పాన్పుపై పవళించి
కడకన్పడని నింగి
కడలిలో పయనించి
అపర నారాయణత
నందు కొంటిని నేను
అపుడె లీలానిద్ర
ననుభవించితి నేను.

ఒకటిరెండు పయోద
శకలమ్ము లేరుకొని
తలగడలుగా చేర్చి
తిలకించితిని భువిని.
అలసముగ సాగు జ్యో
త్స్నాభిసారికల ప
య్యెద తుదలు కన్పించె
నదులేమొ యన్పించె.
రాత్రీనదీ స్నాత
గాత్రులైన తమోభి
సారికలు చీరెలను
స్తన వల్కమ్ములను
ఆరవేసిన జాడ
లగుపించినవి; అట్లు
గాకున్న నవియె సా
గర సరోవరములగు.
బహు చిత్రమిది ఒక్క
పర్యాయ ముభయ భి
న్నాభిసారికల స
న్నాలు కానబడుచుంట.

తమలోని చంచల
త్వము నణంచగ లేక
బహిరంగముగ మొగ్గ
వడినమూఢ వ్రజము
కనుపించె; కాదు వృ
క్ష శ్రేణి యనిపించె.
ఏ రాక్షస క్రియా
హేతువుననో కంఠ
దఘ్నముగ భువిని పా
తర వేయబడిన శి
క్షితుల తలలగుపించె
క్షితిధరము లనిపించె.
తరులు గిరులిటుల చి
త్రముగ రూపొందినవి.
క్రమముగా చూపు లూ
ర్ధ్వముఖమ్ము పర్వినవి.
నారాక గమనించె
నా ? గగనలక్ష్మి తా
నదుగొ దూరము దూర
మొదిగి నిల్చుండినది.
''నాస్తి మధ్యము కంప

సముసెంద మాటి మా
టికి పర్వ్యదీతు వెచ
టికి వియద్భామినీ !
నాకొరకు ధవళ సుం
దర మేఘ తల్పమ్ము
రచియించి నీవు దూ
రాన నిల్చెద వేల ?
నీవు వాసక సజ్జి
కావైభవము ననుభ
వించవలె గాని వరి
యింతువా శూన్యమును."
నా వలపు నుడుల స
న్నని గాడుపులు సోక
పులకించినది వియ
త్తలతన్వి తనువల్లి.
ఆమె మృదుల తనూల
తాకంపనముచేత
జలజలా కురిసె చు
క్కలమల్లెపూజల్లు.
సురభిళమ్మగు వెల్గు
సోనలో మున్కలిడి

తడవి చూచితి జలద
తల్పమ్ము నొకసారి
కలయ జూచితి వియ
న్నిలయమ్ము నొకసారి.
పార్వణ సుధాంశు బిం
బముపైన పవళించి
పదియారు కళల నా
యెదలోన హవణించి;
హేరాళ హేలా దృ
శారమ్య మూర్తినై
నీరదమ్ములు లేని
నింగి సాగుచు నుంటి.
తారాశశాంకులు వి
నా; రేయిజవ్వని వి
నా; కానబడ రెవ్వ
రా కాంతిలోకాన.
నాకు తెలియని భాష
లో కన్పడని సైగ
తో రాజు తారకల
తో నేమొ వచియించె.
తారకలు చక్రముల

తీరు గిరగిర తిరిగి
రవణిల్లె పూర్ణచం
ద్రస్యందనము క్రింద.
గగన ఘంటామార్గ
గత మదిందుస్యంద
నావేగమును పవను
దే పర్ణసము సేయు.

ఒక కొంతసేపిటుల
ఊహాకందని విహా
యసమును తదంతరము
నవలీలగా దాటి ;
ననుసేనె చూచికొం
టిని పుష్పాదులవోలె
కడుమెత్తనైన బం
గరు టిసుక తిన్నియల.
చూపు మేరలనంత
సురఝురి తురగలించె
దిగజారెడు జగ్గా జి
లుగు పైట సవరించె.
నా పదమ్ములు కదలి

నవి ఇసుక తిన్నియల
పైన నొక చిరుముద్ర
నైన పడనీకుండ.
నా గుండియలు మ్రోగి
నవి వియద్ధుని వీచి
కలవోలె నిసుమంత
కలకలము లేకుండ.
కామధేను క్షీర
కాంతుల పిసాళించు
మిన్నేటి నీట కుసు
మించు పొందామరలు ;
పొందామరల పెదవు
లందు చిందు మరంద
బిందువుల సందెడు మి
ళిందముల బృందములు ;
నాలోని సౌందర్య
లోలతను ప్రశ్నించె
నా నవాలోకముల
నట్టె ఆకర్షించె.
ఒక 'నాట్యకత్తె'రొ
మ్ము కుదింపు వంటి లహ

రిక పీవ చూపు లరె
రే తునాతునలయ్యె.
అల్లనల్లన దృక్ప్ర
యము సంకలించితిని
కొంస చూపులందు సుర
ధునిని బంధించితిని.
పద్మములు గావు రం
భాద్యప్సరః ప్రౌఢ
మధురాధరల వదన
మండలమ్ములు గాని ;
బంభరమ్ములు గావు
పంకేరుహాసనల
కం కేళికాగళిత
కచభారములుగాని,
వక్షోజ భరమొక్క
వైపు పంచుచునుండ
శ్రోణీభరమ్మొక్క
చో లాగుచుండంగ ;
ఇరుభరమ్ముల గూడ
సరిసమానము సేయ
నిలువు టీతలనీది

అలసిరి సురాంగనలు.
ననుగాంచిరేమొ అం
గనలంత మీల వలె
నడుములను జళిపించి
బుడుగున మునిగినారు.
కొంతసేపటులే జ
లాంతరమ్మున సాగి
తటనికటమునదేలి
తద్గతాంబరపాళి
కొనవ్రేళ్ళతో లాగి
కొని ; గబాగబచుట్టి
కొని ; ప్రోడతనము సి
గ్గును నులిమి వేయురీ
తిని మొగమ్ములు తుడిచి
కొని ; కేశములు కేల
గొని ; అల్ల విదలించి
కొని ; ఓరగా జార్చి
కనక కింజల్కముల
కెనవచ్చు ననవచ్చు
పలువకొనల భుజాగ్ర
ములయందు గీలించి ;

మందహాస స్యంది
సుందరాస్యములతో
ఉబికివచ్చిరి నీటి
నొక్కుమ్మడిగ ద్రోసి
ఉబికి వచ్చిరి అడుగు
లొయ్యారముగ వేసి.
దివిజగంగా ఫేన
దీప్తి పెంపెసలారు
అచ్చరలు మెల్లగా
వచ్చిచుట్టిరి నన్ను
రంభ పరిరంభ సం
రంభంబు జృంభించ
తనబాహులతలముం
దునను ప్రస్తారించె.
బాహుమూలద్యుతులు
పర్వ నూర్వశి తనదు
కొనవ్రేళ్ళతోడ నిమి
రెను నాదు చెక్కిళ్ళ.
నాచుబుకమెత్తి మం
దార సురభిళమైన
నిశ్వాసవీచి సం

దించె మేనకయంత.
తనమృదు పదములతో
నను మెల్లగా తాచి
క్షమియింపుమని కటా
క్షము సాచెను ఘృతాచి.
ఎదనంటుకొన్న ప
య్యెద కొంగు సడలించి
హరిణి నా చంచలత
నధికాధికము జేసె.
పేరుతెలియని అప్స
రో రమణులెందరో
నను తాకినారు మసృ
ణబిసాంగుళులతోడ.
జ్యోత్స్నాశలాకలటు
చూపడిన అచ్చరలు
స్పృశియింప నాగుండె
దుసికిళ్ళు వడిపోయె.
వడగాడ్పుతెర ఒక్క
పరి చరచి పోయినటు
గుప్పుమని ఆవిరులు
అప్పళించిన యట్లు

చిత్రముగ ననుభవిం
చితి సురాంగనలు నను
స్పర్శించినట్టి లి
ప్త ప్రమిత కాలమున.
మరల నాలో పురాం
తరవృత్తులిగురించి
కలికి వెన్నెలలతో
చెలిమి సేయుచునుండ.
నా నడుము చుట్టు తి
న్నగ కేలుపెనవైచి
నను లెమ్మనుచు పల్కి
నది కనులతో రంభ.
జారు నా ముంగురుల
సవరించు నెపముతో
ఊర్వశి ఉరోజభర
ముంచె నా యెదపైన.
రంభోర్వశీ మరుత్
కుంభీంద్రయానలు ని
జాంసముల నా కర
ద్వయము హాాయలుగ జుట్టి ;
ముందు వెన్కలపైడి

అందియలు ఘల్ ఘల్లు
రస కదలు అచ్చరలు
అప్పుడప్పుడు ముట్టి ;
నడిపించ ఔగాద
నస్ లేక తూలిపో
యితినేను మిన్నేటి
యిసుకతిన్నెల దాటి.

ఇవ్విధముకొంత ద
వ్వేగి చూచితి కాన
బడరెవ్వరౌర ! రం
భా నితంబిని వినా.
నేను సుందర వనము
లోన ; నందన వనము
లోన ; పచ్చని పాన్పు
పైన కూర్చొనియుంటి.
నాయెదుట పవళించి
నది రంభ హేలా వి
లాసాలతో చేతు
లను దిండ్లుగా మలచి.
మంచు తుంపరవంటి

మధు తుషారమువంటి
పుష్పొడుల్ నా దేహ
మును పరామర్శించె.
పారిజాత ప్రసవ
సౌరభమ్ములు నా యె
డందలోపల మంద
మందముగ సర్తించె.
నాచుట్టనేక మద
నస్వాము లాలీఢ
చరణులై నిల్చి కురి
సిరి కుసుమబాణాగ్ని,
నరము నరమున అగ్గి
కరగి పోసినయట్టు
లై అరచినాను దా
హము దాహమని నేను.
నా యెదుట మెయివాల్చి
నట్టి మదిరాక్షి ది
గ్గున లేచి బిగి కౌగి
టను జేర్చుకొనె నన్ను.
అపుడు నేనంటి “రం
భా! నాకు నేదేని

పానీయ మిప్పించ
వే నీకు పుణ్యమగు''.
నా ప్రార్థనమున కు
న్మదనేత్రయగురంభ
ఓరగాగని నెలవి
వారగా నగిపల్కె,
''ఔర! యెంతటి అమా
యకుడవోయీ నీవు
తలపైన గంగనిడి
జలమునకు వెదకేవు''.
ఈరీతి పల్కి రం
భారమణి స్వీయ బిం
బాధరము నామోము
నందు బలిమిగ మోప ;
నాలోన బాడబ
జ్వాలలు విజృంభించె
నిప్పునకు నేయి నం
దించి నటులనిపించె.
అంత గొంతెత్తి ''రం
భా! రంభ! నాప్రాణ
ములు తీయకే ! శీత

జలము లిప్పించవే!"
అనుచు దీనముగ ప
ల్కినయంత నిసుమంత
కనికరము తొల్క ప
ల్కినది అనిమిషకాంత.
"మనిషి పోలిక జల
మ్మున కర్రుసాచెదవు
పెదవి నందించ కం
పిలి దెసల్ చూచెదవు.
అధరామృతమ్ము చే
దై పోయెనా నీకు
అటులైన అమృతమే
అందజేతును నీకు".
అనిరంభపైకి సా
చెను దక్షిణకరమ్ము
చోద్యమేమని నిక్కి
చూచినది కుడిరొమ్ము.
అంత నా రంభా క
రాంభోజమున నిల్చె
స్వర్ణ పాత్ర; మ్మామె
వక్షోజ మాత్రమ్ము.

పేరెడారిని నీర
మూరిసటులనిపించె
రంభ కేలున అమృత
కుంభమ్ము కుసుమించ.
నాలోని పూల మం
టలను చల్లార్పంగ
ఆమె నాకందించె
అమృత కలశాననము.
ఒక అమృత కణిక జి
హ్వాకపైన బడినంత
చనెడు ప్రాణములు గి
రుస తిరిగి వచ్చినవి.
ఒక సుధాధార గొం
తుకలోన జారంగ
లోని బడబాగ్ని అపు
డే నీరునీరాయె.
నాలోని ప్రత్యణువు
నాగస్వరమ్మాయె
నాలోని ప్రతిసరము
నాగ సర్పమ్మాయె.
అటులెంత కాలమ్ము

అమృత కలశమ్ము తన
పెదవి నా పెదవిపై
అదికించి నిల్చెనో
అటులెంత సేపు రం
భాప్సరో రమణి తన
రెండు చేతుల సుధా
భాండమ్ము నిల్పెనో
నే చెప్పలేను గా
ని యొకింత సేపటికి
స్ఫురియించె నామైపై
ఒరిగినట్టులనేను.
అమృతపానప్రమ
త్తాత్మకుడనగునన్ను
నడిపించినది రంభ
నడుముపై చెయివైచి.

మరునిముసమున కనుల్
మిరుమిట్లు గొల్ప ని
ర్జరలోకపతి సభాం
తరమందు నిల్చితిమి.
విచ్చుతామరలైన

అచ్చరల గుంపులో
రాయంచవలె మహేం
ద్రస్వామి కన్పించె.
ఊర్వశీ బింబాధ
రోష్ఠ నిహితములైన
చూపులను మరలించె
సురరాజు మావైపు.
ననువీడి రంభ చం
చచ్చంచల విధాన
ప్రణమిల్లె మేఘవా
హనుని సముఖములోన.
ఒకకేల సౌరపా
త్రిక తొణకి పోవంగ
మరియొక్క కేలురం
భను చుట్టివేయంగ
సురరాజు నావైపు
జూచె చూడనియటుల
తరువాత సభనొక్క
పరి హాొయలుగాజూచె.
ఒకకంటితో నూర్వ
శికి నేమియోతెల్పె

మరియొక్కకంట రం
భకుసేమొ వచియించె.
రంభోర్వశులు నాట్య
రంగ స్థలమునందు
కన్పడిరి మెరుపు తీ
గలు నిల్చెనో యనగ.
ప్రాఙ్ముఖుండై సభా
పతికూరుచౌని యుండె
ఎదుట ప్రౌఢాప్సరో
మదవతీద్వయముండె.
ఇంద్రుని శిరమ్ము కా
సింత కదలెనొలేదొ
కదలె రంభోర్వశుల
పదకింకిణీశతము.
రంభోర్వశులు సమశి
రస్కలై మఘునకు
అంజలించిరి పతా
కాయత కరాబ్జలై.
ఆలోలితశిరస్క
యై రంభ అర్ధచం
ద్రాకారహస్త మొ

య్యారమ్ముగా నిల్చె.
ఉత్క్షిప్త శిరముతో
ఊర్వశి కదలి పద్మ
కోశముద్రను దాల్చి
క్రుమ్మరించెను హొయలు.
రేచితభ్రువులతో
లేచి రంభ నిహాంచి
తశిరస్కయై కర
ద్వయిని డోలగజేసె.
చతురభ్రువులతోడ
సాగి ఊర్వశి ముష్టి
హస్తముద్రను దాల్చి
మస్తకము నాడించె.
కటకాముఖమ్ము నొ
క్కతె ప్రదర్శింపంగ
మరియొక్క భామ బం
భర ముద్రజూపించె,
అప్సరోయుగి ఆంగి
కాభినయమునుజూప
వేయికన్నులవాడు
వెరగంది తిలకించె.

అనిమిషాంగనల మస్మృ
ణాంగములతోబాటు
సభలోన వేలమ
స్తకము లూగుచునుండె.
పటహాభేరీ బంభ
పణహ దర్దుర డిండి
మ మృదంగములు ధణా
మ్మని మ్రోగి చెలరేగ ;
అప్సరోద్వయి నొకతె
ఆవిఘ్నయై రేచ
కాంగహారములతో
నాడె శివతాండవము.
అంతరెండవ అమర
కాంత ఒయ్యారంపు
బంతులు సుమించగ శి
వా లాస్యమొనరించె.
తదనంతరము మొదటి
తరుణి పద్మాసనము
వైచి, విశ్వామిత్ర
వాచంయమిగ మారె.
మరియొక్క సురనారి

తరళితాంశుక పయో
ధరయై మునీంద్రుముం
దర నిల్చె మేనకగ.
మేనక మునీంద్రుని స
మీపించి తాకె కిస
లాంగుళలతోడ లో
హాసదృక్ష దేహమును.
కౌశికుని కనులించు
క వికాసమును జెందె
అతనికట్టెదుట మది
రాక్షి నిల్చొనియుండె.
అతడు వాలుగజూడ
ఆమెశ్రోణులు కుచము
లుబ్బి తబ్బిబ్బాయె
ఉన్మత్తుడతడాయె.
అతనిగుండియలోన
అతనుడు విజృంభించె
నిగ్రహము వీడి పా
ణిగ్రహమ్మొనరించె.
ఈరీతిగా ఊర్వ
శీరంభ లప్రమే

య స్వీయ వివిధ నా
ట్య విభేదములు నూప ;
వర్షాంబుధర గర్జ
వలె ఇంద్రసభనిండ
హర్షధ్వని ప్రకర
మలలెత్తి సాగినది.
నాట్య ప్రదర్శనా
నంతర క్షణమందు
జంభారి సముఖాన
రంభోర్వశులు వ్రాల
వారిర్వురిని ఉభయ
బాహుపాశములందు
బంధించి చుంబన
ప్రసృత భావుండయ్యె.

సభలోన నేవైపు
శ్రవణమ్ము లొగ్గినను
రంభోర్వశీ సక్త
సంభాషణలువించె
సభలోన నెటుదృశా
చాలనము చేసినను

గుసగుసలువడు అప్స
రసల గము లగుపించె.
ఒకగుంపురంభ నా
ట్యకళన్ ప్రశంసించె
వేరొకటి ఊర్వశిని
వేనోళ్ళ వినుతించె.
మరియొక్క అప్సరో
మండలమ్మూర్వశిని
దరిసి యనె "రంభ యెం
తటిది నీ ముం"దంచు.
ఆమండలమె రంభ
నలమికొనిపల్కె "ఊ
ర్వశిని తలదన్నిన సు
రప్రమదవీ" వంచు.
ఈదృశముఖస్తుతుల
నీదృశ పరస్పర
ద్వేషస్థితుల దేవ
యోషలందున గాంచి ;
మ్రోడువారితినేను——
మును నాట్యపీయూష
మున మోసులిడిన భా

వనల రేకులు రాల
మ్రోడు వారితినేను
బీడువారితినేను.
అప్సరోలోకమ్ముగ
నను కొంటి ఆదర్శ
ముల రూపములు మొల్చు
పుణ్యాల నేలయని.
దేవతాలోకమును
భావించితిని పర
స్పరసహానదుగ్ధసా
గరకనద్వేల యని
నాయాశలెన్నొ 'ఛి
న్నాభిన్న'ములు కాగ
లోలోన ఎంతగా
నో లజ్జితుడనైతి.
నా పురోగతభావ
నాశకటి వెన్కవె
న్కకు తిరిగిపోవు చుం
టను రంభ పసికట్టి ;
తవబాహురజువుల
నను మెత్తగాచుట్టి

నడిపించె మునుముందు
నను గుండె మెలివెట్టి.

అమరావతీ నగ
ర్యభ్యంతర స్ఫీత
శృంగాటకముల జో
చ్చితిమి రంభయు నేను.
నవరత్నఖచిత సుం
దర శాతకుంభ కుం
భాదీప్త తుంగ హ
ర్మ్య పరంపరల్ గనుచు,
హర్మ్యాంతరాళ బహి
రాయాత యక్షమిధు
న ప్రణయకలహ మం
ద్రస్వరమ్ములువినుచు,
ఘంటాధ్వ కామినీ
కబరీభరోల్లస
న్మందారసౌరభో
న్మత్తచిత్తుడనగుచు,
లుఠిత పాదములతో
లులిత భావములతో

త్రుటిలోన వీధుల
న్నిట చుట్టి వచ్చితిని.
అటులెన్ని ఘటికలా
అస్వప్న పురిలో ము
హుర్ముహుర్భ్రమణమ్ము
నొనరించితినొ యేమొ ;
గణన సేయగలేను
గాని ఏ వీధికే
గిన నొకేదృశ్యమ్ము
కనులెదుట నర్తించె.
గగనగంగాతరం
గాళి వలె పొంగారు
బిగి జవ్వనమ్ము నా
పగలేని మిధునములు,
మదనులును మదన సా
మ్రాజ్ఞీమణుల్ వినా
త్రిదశాలయమున అ
న్యదశాగతులులేరు.
తృషితుడెందాకయని
తేనె సోనలు ద్రావి
తన లోపలి పిపాస

అణగార్చుకొన నేర్చు ?
నాలోని దేవతా
నగరీ దిదృక్ష స
న్నగిలె నంతట యౌవ
నప్రోల్బణము చూచి.
ఇదియేమిలోక ము
న్మదనేత్రలేకాని
ఇచట చాంద్రీప్రస
న్నేక్షణలు కనరారు.
రదనచ్ఛదాసక్త
రమ్య గండస్థలులె
కాని తాకిన పాలు
గారు బుగ్గలు లేవు.
వక్షోజభరముతో
వంగు వారలె కాని
అనుభవ భరాన వం
గినవారు కనరారు.
మంచుపొరలనుబోని
మదనబంధమ్ములే
కాని అచ్ఛిన్నరా
గ నిబంధనలు లేవు.

ఇదియేమి లోకమో
ఇదియేమి నాకమో
ఎరుగజాలక గుండె
పొరలుగా విడిపోవ ;
''ఓసిరంధ్రా ! కదల
వే సహింపగలేను
నను నందనోద్యాన
మున జేర్చవే''యంటి.

నందనోద్యానమ్ము
నందు మెయివాల్చినను
శమియింపలేదు నా
సంత్రస్త హృదయమ్ము.
పారిజాత ప్రసవ
పరిమళమిళన్మరు
న్మాలికలు సౌరవని
లో లాస్యములుజేసె.
పారిజాత ప్రసవ
పరిమళమిళన్మరుద్
వీచికలు నాయెడద
లో చిందులను ద్రొక్కె.

ఇవియేమి పరిమళ
ద్రవములో నాదు జా
గరితాత్మ శీధు ది
గ్ధమ్ముగా నొనరించె.
నాలోన మందమం
దముగ రగిలెడు నిప్పు
నీ సౌరభములు జ్వా
లేరితమ్ముగజేసె.
ఒకవేయి తేళు లూ
రకప్రాకినట్టులై
ఒకలక్ష నాగుల
ల్లుక పోయినట్టులై
మై జల్దరించ 'రం
భా! నన్ను రక్షించ
వే' యంచు క్రందనము
సేయగా దొరకొంటి.
అపుడు దాని కరమ్ము
నందు తొల్త టివోలె
కానుపించెను సుధా
కమనీయ భాండమ్ము.
అమృతపానానంత

రమున మరచితినేను
నందనమ్ము౽ను దివిజ
నారీవతంసమును.
ఎదొ౽పరిచిత స్వాదు
హేలా జగతిలోన
ఎదొ౽దృష్టపూర్వ స
మ్మదఝురీ గతిలోన ;
వెలుగు నీడలు చెరం
గులను ముడివేసికొని
నవ దంపతుల వోలె
నడయాడులోకాన ;
స్వరవాహినులలోన
విరిదో నియల పైన
తేలియాడితి నేను
తెమ్మెరగ తుమ్మెదగ.
ఏ భుజంగియొ కాటు
నిడిన యట్టుల తోచి
త్రుళ్ళిపడి కనురెప్ప
లల్లార్చినానంత.
ఎవరొ౽ కాదది రంభ
యే—"ఓసి మదవతీ !

కాటువేసితివ చే
కనుమాటుగానన్ను.
నీ స్వర్గమునకంద
ని నిసర్గలోకాన
కదలు నామనసు రె
క్కల నేల విరచితివి ?
ఒక మహాంగారధా
నికవోలె ఉడికించు
ఈ నందనమున కే
లా నన్ను ఈడ్చితివి ?
క్షణమైననాకువి
శ్రాంతి నివ్వగలేని
ఈనేల నాకమెటు
లౌనె అచ్చరచాన ?
మొలక జవ్వనము దా
గిలి మూతలాడంగ
తొలిసిగ్గు బరువుతో
తలవాల్చి కిల్కుమను
పడుచు మల్లియల లా
వణ్య శోభారేఖ
నీప్రౌఢ పారిజా

త ప్రసవములకేది ?
ఒక కొంతసేపు సివ
మూగు పెంజీకటులు ;
ఒక కొంతసేపులా
సకమాడు వెల్తురులు ;
ఒకకొంతసేపు అ
న్యోన్య గాఢాశ్లేష
ముల మైమరచు సంజ
వెలుతురులు చీకటులు ;
ఆ యపర జగతికే
అంకితములో చాన !
ఆ ద్వైతజీవన
మ్మగుపడునె స్వర్గాన ?
ఏనాడొ వెర్రినై
ఏను కాంక్షించితిని
నిత్య మధుమాసముల
నిత్య రాకానిశల.
కాని అవియే స్వర్జ
గత్తులోనేడు ప్ర
త్యక్షమొందగ అస
హ్యాత ముసురుకొనివచ్చె.

భిన్నానుభూతులకు
పేటీసదృశమైన
ఆ లోకమేనాకు
అమృతాయమానమ్ము.
మబ్బుతెరల విధాన
మంచుపొరల విధాన
క్రమముగా నాలోన
కదలెను పురాస్మృతులు.

ఒకస్నిగ్ధవేళ వా
ర్షికపయోధర సర్త
నములతో నాయెడం
ద మయూరమైపోయె,
ఒక శరత్సమయాన
వికచ పూర్ణేందు బిం
బము గాంచి నామనసు
పాలసంద్రమ్మాయె.
ఒకసాంద్ర హైమన
ప్రకటవేళామరు
త్తులకు నాయెడద ని
ప్పుల విపంచికయాయె.

ఒక శైశిరర్తువున
ఉద్విగ్నమై నాదు
చిత్తమ్ము ఆకురా
ల్చిన భూజముగమారె.
ఒకతేనె గడియలో
ఉల్లసితమై నా యె
డద మల్లెపూలతో
టగ రూపుదిద్దుకొనె.
ఒక గ్రీష్మకాలమం
దుత్తప్తమై నామ
నస్సు విరహివిధాన
ఉస్సురని వాపోయె.
షడృతుచక్రానంత
చలనమాలోకమున
నే కాని యిచట క
న్పించునే కలనైన.
ఇసుమంత మార్పులే
ని సురాలయములోన
ఏ నెటుల జీవింతు
నే అచ్చరల జాణ!
క్షణమైన కనులుమూ

సిన పాపమునబోరు.
కలల తియ్యందన
మ్ముల గానగాలేరు
అమృతమ్ముదప్ప దా
హ నివారణమునకై
సెలయేళ్ళ హిమజలం
మ్ముల గ్రోలగాలేరు.
ఏమిలోకమ్మిద్ది
ఏటి సురలేమీరు ?
పటములోపలి బొమ్మల
వంటివారలు మీరు.
కేవల సుఖాసక్త
జీవనులు మీరెటుల
దేవతలు ? మీకేల
దివ్యమహిమాస్ఫూర్తి ?
సస్యలక్ష్మీకలిత
జగతియే స్వర్గమ్ము
స్నేహార్ద్రచిత్తులగు
జీవులే దేవతలు.
నేను భూస్వర్గమున
కే నిల్చియున్న పా

టునబోదు నిముసమై
నను నిల్వలేనిచట.
నారెక్కలేమైన
వే రంభ ! ఓసి కా
మిని ! మారుపల్కవే
లనె ? నవ్వులేలనే ?
నను పక్షరహితుగా
నొనరించి బంధించ
గడగుచున్నావ ? నా
కము పేరి నరకమున.
నీ కోరనవ్వులకు
నీ ఓరచూపులకు
చల్లబడిపోవగా
జడదారి నేగాను.
ఏమి సాహసము మూ
ర్తీభూత దుష్కామ
రూపమా ! అపుడె నా
పైపైకి వచ్చెదవు.
నీవెన్నితీర్ల మా
యావాగురలు పన్ని
నను చేరెదను రివ్వు

మని మాతృజగమునకు.
ఇదిగొ నే నిష్క్రమిం
చెద ; నీకు నీదివికి
నీయింద్రసభకొక్క
వేయిజోహారులే."
అనిపల్కుచు హఠాద్గ
మనకాంక్షతో ముందు
కాలిడగతోచె పం
కాన దిగబడినట్లు.
ఏటికెదురీతగా
ఈడ్చుకొనుచుంబోవ
వెంటబడె రంభ న
వ్వినది నవ్విన యట్లు.
దానిపరిహాసములు
దావానలజ్వాల
లై తరిమితరిమి వెం
టాడజొచ్చెను నన్ను.
కొంత సేపాందోళి
తాంతరంగుండనై
వశముదప్పిన కాళ్ళ
పైపర్వు లెత్తితిని.

కనుచూపు మేరలో
గంగాభవాని చే
తులనెత్తి సాంత్వ నో
క్తులు పల్కినటులయ్యె.
''నాతల్లి గంగమ్మ
శీత పర్యంకమున
కను మూతు నింక స్వ
ర్గపు బెడద తప్పె''నని
వెనుదిరిగి చూచి నా
డను బాపురే! ఒక్క
రంభయే కాదు వే
ల సురాంగనల బారు,
రమ్మనుచు పిల్చె గం
గమ్మ చల్లని గళము.
ఆగుమనికేకలిడె
అప్సరో మండలము.
సురనిమ్నగా తరం
గ రయోత్థ నిస్వన
శ్రేణికలు నామనసు
లోన జోలలు వాడె.
అప్సరస్సంఘాట్టి

హాసీధ్వనులు నాయె
దచలో మహాప్రళయ
డమరువులు వాయించె.
కనులెదుట ప్రకృతి గి
ర్రున తిరిగినట్లులై
కాళ్ళక్రింది ధరిత్రి
కరగుచున్నట్లులై
ఏదోమహావేళ
మేధితమ్మైవచ్చి
నన్నొక్కపరి ముందు
నకు త్రోసినట్లులై
కెవ్వుమని అరచి దూ
కితిని తుహినాచలపు
వీపు చిట్లించిన సు
రాపగా ధారలో.
అపుడు నాకనిపించె
అత్యున్నతాద్రి కొస
నెత్తమ్మునుండి న
న్నెత్తి విసిరినయట్లు ;
కారుచీకటిపాము
గములల్లుకొన్న పెన్

లోయలో తల|కిందు
లుగ కూలుచున్నట్లు ;
అట్టడుగునందున్న
ఆదిశేషుని బుస్స
గొట్టుతలపైకాలు
బెట్టినట్లు—స్ఫురించి ;
మరల నరచితిని నా
శిరము రెండుగజీల
ఉవ్వెత్తెగిసి కూరు
చుంటి పానుపుమీద.

నను నేనె స్పర్శించు
కొని అబ్రపడిపోతి.
నాచుట్టు పరిశీల
నముచేసి వెడగైతి.
కనురెప్పలల్లార్చి
తిని గ్రుడ్డివెల్తురున
భయకంపితశరీర
ప్రాణసఖియగుపించె.
ఆమె పాణిద్వయము
ఆత్రముగ చలియించె

నామేని పైననే
నామోము పైననే.
ఆమెముఖమందు ప్ర
త్యణువులో సాధ్వసో
ల్బణముతోపాటెదో
ప్రశ్నాళి యల్లుకొనె.
నా వికారస్వప్న
మేవిధమ్మున చెప్పు
వాడ మన్నిష్ఠస
ర్వప్రాణయగు ప్రియకు.
నాలోన దాగియు
న్న వికారభావనయె
కలరూపుతో వచ్చి
కలవరమ్మిడె నాకు.
ఎటులైననేమి నా
హృదయగత దుష్ట ప్ర
కృతిలవము సైతము వి
ధుతమయ్యె నీనాడు.
'మానవసమాజమ్ము
మానధనయైన సతి
కల్గుచో నేల స్వ

ర్గము'లంచు మదినెంచి
స్వప్నభంగోత్థ వి
స్తార రోమాంచమ్ము
నటులె నిల్పితిని అ
ర్ధాంగిని కవుగిలించి.



